*వెయ్యేళ్ల తరువాతైనా సరే, ఈ పదాలు ఎవరికోసం ఉద్దేశించబడ్డాయో వారిని చేరతాయి – రూమి*

## మనవి మాటలు

జలాలుద్దీన్ మహమ్మద్ రూమి కవిత్వాన్ని మొదటి సారిగా 2009 లో చదివాను. ఆ భావతీవ్రతలో కొట్టుకుపోయాను. కొన్ని కవితలను అనువదించి నా బ్లాగులో పోస్ట్ చేసాను.

అంతర్జాలంలో రూమి కవిత్వంలోని వాక్యాలను కొటేషన్లుగా పోస్ట్ చేసే అనేక గ్రూపులను చూసి ప్రేరణ పొంది 20 March 2016 న "రూమీ వాక్యాలు" పేరుతో ఒక ఫేస్ బుక్ గ్రూప్ క్రియేట్ చేసాను. రూమీ కోట్స్ ను అనువదించి దానిలో చాన్నాళ్ళ పాటు పోస్ట్ చేసాను. వాటన్నిటిని ఒకచోటకు చేర్చాలనే ఉద్దేశంతో ఇ.బుక్ రూపంలో వెలువరిస్తున్నాను.

ఏడువందల సంవత్సరాల తరువాత కూడా జలాలుద్దిన్ రూమి రచనలకి ఆదరణ తగ్గలేదు. రూమి సాహిత్యం ఇస్లామ్ మత బోధనలకు అనుగుణంగా నడచినప్పటికీ, ఏ మతప్రసక్తి లేనటువంటి ఒక సార్వజనీన మానవానుభూతిని వాక్యవాక్యానా పోల్చుకొనగలం.

బొల్లోజు బాబా
8/5/2022

## జలాలుద్దీన్ మహమ్మద్ రూమి (1207-1273)



రూమి పదమూడవ శతాబ్దానికి చెందిన పర్షియన్ కవి. దేవుని చేరటానికి కవిత్వం, సంగీతం, నృత్యం ప్రధాన సాధనాలని రూమీ భావించాడు. ఈతని కవిత్వం ఏమతానికి చెందక మానవత్వాన్ని ప్రతిబింబిస్తుంది. జీవితాన్ని అక్షరాలుగా మలచి అందించాడు రూమి. ఇతని కవితలలో మార్మికత, భావుకత, మానవత్వంపై అచంచల విశ్వాసం, దేవుని పై ఆరాధనా కనిపిస్తాయి. ఈ నాటికీ ప్రపంచవ్యాప్తంగా రూమీ కవిత్వానికి ఆదరణ ఉన్నదంటే దానికి కారణం ఆయన కవిత్వంలో పరచుకొన్న మానవజీవన చిత్రణే.

1. ప్రతి మతంలో ప్రేమ ఉంటుంది, కానీ ప్రేమకు మతం లేదు

2. నీవు నిజంగా దేన్నైతే ప్రేమిస్తున్నావో అది నిన్ను నిశ్శబ్దంగా ఈడ్చుకుపోనీ .... ప్రేమ ఏనాడూ నిన్ను తప్పుత్రోవలో నడిపించదు

3. దాహం వేసినపుడు నీవు తాగే నీటిలో దేవుని రూపం కనిపిస్తుంది. దేవునితో ప్రేమలో లేని వారికి, వారి ముఖాలే కనిపిస్తాయి.

4. నిశ్శబ్దం ఈశ్వరుని భాష, మిగిలినదంతా నిస్సారమైన అనువాదం

5. పదాలింక చాలు మిత్రమా చెవులను చూడనియ్యి. నీ మిగిలిన కవితను ఆ భాషలో మాట్లాడించు

6. ఈ కవిత నిడివి తగ్గిస్తాను ఎందుకంటే, అదంతా ఈ ప్రపంచంలో మన కళ్ళముందు కనిపిస్తూనే ఉంది.

7. ఈ నిశ్శబ్దాన్ని గుర్తించావా? అది నువ్వు నీ గదిలో ఒంటరిగా మాట్లాడటానికి ఎవరూ లేనప్పటి నిశ్శబ్దం లాంటిది కాదు.

8. ఇది స్వచ్ఛమైన నిశ్శబ్దం ఇది బ్రతికున్న కుక్కలు చచ్చిన కుక్కను పీక్కు తింటున్నప్పటి నిశ్శబ్దం కాదు.

9. నిర్మలమైన ఖాళీగా మారు అందులో ఏముంటుంది? అని నువ్వు అడిగితే నిశ్శబ్దం మాత్రమే అని చెప్పగలను.

10. నిశ్శబ్దం నువ్వు సాధన చేయాల్సిన కళ

11. నా అవసాన దశలో, ఇక ఒక్క శ్వాస మాత్రమే మిగిలి ఉన్న తరుణంలో, నీవు వస్తే లేచి కూర్చొని, గానం చేస్తాను

12. నేను నీ మనిషిని. నన్ను తిరిగి నాకు ఇచ్చేయకు

13. కవిత్వం చాలా ప్రమాదకరమైనది, మరీ ముఖ్యంగా అందమైన కవిత్వం. ఎందుకంటే అది ఒక అనుభూతినిప్రత్యక్షంగా అనుభవించకుండానే అనుభవించిన భ్రమను కలిగిస్తుంది

14. గులాబీ తనని ఎవరైనా ముల్లు అని అన్నా లేక మల్లె అని పిలిచినా పట్టించుకోదు

15. ఈ ప్రదేశం ఒక స్వప్నం. నిదురించేవాడే దీనిని నిజమనుకొంటాడు

16. ఏది ఎక్కువ విలువైనది, కిక్కిరిసిన జన సందోహమా లేక స్వచ్ఛమైన నీ ఏకాంతమా?

17. ప్రతి చెట్టు ఆకు మరోలోకపు సందేశాన్ని మోసుకొస్తుంది. చూడు రాలిపోతున్న ప్రతి ఆకు ఒక దీవెనే

18. మరో లోకం లోకి ఎగురుకుంటూ పో. మోయగలిగినంత సంపదల్ని తీసుకుపో, రోదించకు

19. నేను నిజం చెపుతున్నాను, నువ్వు చూసే ప్రతీదీ స్వప్నం వలే అదృశ్యమైపోతుంది

20. ప్రియమైన ఈశ్వరుడా, ప్రేమికులందరిని తృప్తిపరచు. వారికి సుఖాంతాలను ఇవ్వు. వారి జీవితాలను పండగగా మార్చు. నీ దయాకాంతి లో వారి హృదయాల్ని నృత్యం చేయనీ.

21. నీకు ఏది ఇచ్చినా అది తిరిగి నావద్దకు వస్తుందని నాకు తెలుసు. అందుకే నీకు నా జీవితాన్ని ఇచ్చేస్తున్నాను, నువ్వు తిరిగి నా వద్దకు వస్తావన్న ఆశతో

22. సూర్యునితో పాటు ఉదయించు. నిద్ర అనే గుహనుండి బయటకురా. అపుడే ముల్లు గులాబీగా వికసించగలదు.

23. తెరవెనుక నుంచి ఎవరో మనల్ని గమనిస్తున్నారు. నిజానికి మనమిక్కడ లేము. ఇది మన ఛాయ.

24. నీకు అనుకూలంగా నిన్నందరూ మోసగించారు అన్నట్లుగా జీవించు

25. దినాంతాన ఆత్మ మురికినీరులా అయి, సన్నని స్వరంతో ధన్యవాదాలు, ధన్యవాదాలు అంటుంది

26. నా హృదయ మార్గంలో ఆత్మ చందమామ కనిపించింది. ఆ ప్రయాణం ఎంత అమూల్యమైనది!

27. వేదన ఒక బహుమతి. దానిలోనే దయ దాగిఉంది.

28. నిన్ను చూస్తూ ఉండటం నన్ను స్వస్థ పరుస్తుంది

29. కాంతిని కౌగలించుకో, నీ వాంఛా పవనాలకు అవతల ఉన్న దారుల్ని అది నీకు చూపనీ

30. వేణువుఊదేవాని ఊపిరి వేణువుకు చెందుతుందా?

31. అలసిన మనసులపై నా మాటలను వెదచల్లి వృధాచేసుకోను

32. సముద్రమంత దాహం కలిగిన వారితోనే మాట్లాడగలను

33. ఏదయినా వసంతంలో పుట్టి శిశిరంలో రాలిపోతాయి కానీ ప్రేమ రుతుసంబంధి కాదు

34. కాంతి నీ గురువు రూపం. నీ శత్రువులు చీకటిని ప్రేమిస్తారు

35. మనం పదాలకు అతీతం

36. ఈ దేహం ఒక వస్త్రమని నాకు తెలుసు. వెళ్లు... ధరించినవాడిని అన్వేషించు, దుస్తుల్ని కాదు

37. గుర్తుంచుకో నీవు కలుసుకొన్న ప్రతి ఒక్కరూ, దేనిగురించో భయపడుతూంటారు, దేనినో ప్రేమిస్తూ ఉంటారు, దేనినో కోల్పోయి ఉంటారు

38. ఆసుపత్రి గోడలు, ఆలయాల కంటే ఎక్కువ ప్రార్ధనల్ని విని ఉంటాయి \

39. వెయ్యేళ్ల తరువాతైనా సరే, ఈ పదాలు ఎవరికోసం ఉద్దేశించబడ్డాయో వారిని చేరతాయి

40. ఆలయాలు పేదవారు బయట అడుక్కొంటే, ధనవంతులు లోపల అడుక్కొంటారు

41. ప్రపంచం ఆనందంగా ఉండాలనుకొంటోంది, దానికి నీ వేదనను పంచకు

42. నాకు తెలుసు నువ్వు అలసిపోయావని, కానీ రా... ఇదే దారి

43. నేను నాహృదయం లోలోతుల్లో ఎవరున్నారా అని తవ్వుకొంటూ పోతున్నాను, ఎంత తవ్వుతున్నానో అంతకంతా నన్ను నేను కోల్పోతున్నాను

44. దీపాలు వేరువేరుగా ఉన్నా కాంతి ఒక్కటే

45. ఈశ్వరుని ప్రేమకు వెలుపల ఉండే ఏ ప్రేమైనా వేదనే

46. నిశ్శబ్దంగా ఉండు! మౌనంలో, నేనుగ్రహించిన పరిమళాన్ని నీవూ వినగలవు

47. నీకు ఇవ్వబడిన దానిని మృత్యువు తీసుకుపోయే లోపు, నీవు ఇవ్వగలిగింది ఏదైనా ఉంటే ఇచ్చేయి

48. తరువులా జీవించు, మృతపత్రాల్ని రాలిపోనీ

49. చిన్నిమడుగులోంచి బయటకు ఈదుకొని రా

50. నేనో గులాబిరేకను. నీవు నా కొండగాలివి. నన్ను విహారానికి తీసుకెళ్ళు.

51. మానవరూపంలో నన్ను చూడాలనుకోకు. నేను నువుచూసే చూపులోనే ఉంటాను

52. నీ అస్తిత్వాన్ని మరచిపోయేలా ఈశ్వరుని ధ్యానించు. పిలిచే వాడు పిలవబడేవాడు అద్రుశ్యమయ్యేలా ఆ పిలుపులో నిన్ను నువ్వు కరిగించుకో

53. బుద్ధికి అర్థంకాని విషయాల్ని వినటానికే హృదయానికి చెవులు ఇవ్వబడ్డాయి

54. ఈ రాత్రి నాగురించి వెతక్కు. ఈ రాత్రికి నేను లేను.

55. నేను నా ప్రేయసితో నాట్యం చేస్తూ ఉన్నాను. నా హృదయంతో ఊసులాడుకొంటున్నాను. ఈశ్వరుడా! ఉదయాన్ని తెరిచే తాళంచెవి కనిపించకుండా చేయి ఈ రాత్రికి..

56. దూరంనుంచి నీవు నా కాంతిని మాత్రమే చూస్తావు, దగ్గరకు రా... నేనే నీవని తెలుసుకొంటావు

57. సూర్యకాంతిలో ధూళిరేణువుల్ని నేను, గుండ్రటి సూర్యబింబాన్ని నేను. ధూళిరేణువులతో నిలిచిపో, సూర్యునితో కదిలిపో అన్నాను నేను. నేనే నీవు

58. నా ఒక్కని అంగీకారంతోనే నేనిక్కాడికి రాలేదు, అలాగే వెళిపోనూ లేను. ఎవరైతే నన్నిక్కడికి పంపించారో, ఆయనే నన్ను ఇంటికి తీసుకెళ్ళాలి

59. హృదయాన్ని జాగ్రత్తగా పోషించు. ఎందుకంటే అదిమాత్రమే స్వర్గానికి చేరుతుంది.

60. ప్రేమ మతం ఒక్కటే ఇక్కడ రాసి ఉంది. ఎవరు చెపుతారు ఈ మాట? నువ్వు నన్ను తెలుసుకో, లోతుగా తెలుసుకో!

61. తలుపలా తడుతూనే ఉండు. లోపలి ఆనందం కిటికీ తెరచి "ఎవరదీ?" అని చూసే దాకా!

62. నీ అస్థిత్వాన్ని మరచిపోయేలా ఈశ్వరుని ధ్యానించు. పిలిచే వాడు పిలవబడేవాడు అదృశ్యమయ్యేలా ఆ పిలుపులో నిన్ను నువ్వు కరిగించుకో

63. నీ చిన్ని మడుగులోంచి బయటకు ఈదుకొని రా -- రూమీ

64. సూర్యకాంతిలో ధూళిరేణువుల్ని నేను
గుండ్రటి సూర్యబింబాన్ని నేను
ధూళి రేణువులతో నిలిచిపో
సూర్యునితో కదలిపో అన్నాను నేను
నేనే నీవు

65. నేను నవ్వుతున్నానో, ఏడుస్తున్నానో ఎవరూ చెప్పలేకపోతున్నారు, నాకే ఆశ్చర్యంగా ఉంది.

66. నిన్ను నీవు పగలకొట్టుకొనేదాకా ఆడుతూనే ఉండు

67. నేను ఈ గాలిలో ఎక్కాడో తప్పిపోయాను

68. బుద్ధికి అర్ధంకాని విషయాల్ని వినటానికే హృదయానికి చెవులు ఇవ్వబడ్డాయి

69. ఎవరు అదృష్టవంతుడు? కొలనులో నీరు తాగటానికి వచ్చి దానిలో చంద్రుని ప్రతిబింబాన్ని చూసేవాడు

70. ఈశ్వరుని నీడ తర్కం. సూర్యుడే ఈశ్వరుడు

71. నీ దగ్గరకు చేరే కొద్దీ, నేనెంత దూరంలో ఉన్నానో మరింత స్పష్టపడుతోంది

72. నాలోకి చూసుకొన్నాను. నా ఖాళీతనపు సౌందర్యం తెల్లారేదాక నన్ను నింపుతోనే ఉంది.

73. ప్రయాణం ఆపకు ఏదో ప్రదేశాన్ని ఇష్టపడిన మరుక్షణం అదంటే నీకు విసుగు మొదలౌతుంది.

74. నీ పని ప్రేమను అన్వేషించటం కాదు- దానికి వ్యతిరేకంగా నీలో నిర్మించుకొన్న అన్ని అడ్డంకులనూ వెతుక్కొని పట్టుకోవటం మాత్రమే

75. శలభం దీపాన్ని తప్పించుకోలేదు. రాజు నగరంలోనే నివసిస్తాడు

76. ఎవరు వింటారు, ఏమనుకొంటారు అన్న చింతే లేకుండా ఆ పక్షుల్లా పాటలు పాడుకోవాలని ఉంది

77. దుఃఖం నీ ఇంటిని శుభ్రంగా ఖాళీచేసి పారేస్తుంది, అపుడు కొత్త సంతోషాలు ప్రవేశించటానికి చోటు లభిస్తుంది

78. ఉదయపు గాలులు వీస్తున్నాయి. ఉదయపు గాలులు తమ తాజా వాసనలను పంచుతున్నాయి. నిదుర లేచి వాటిని

ఆహ్వానించు. మనలను బ్రతికించే గాలులవి. అవి వెళ్లిపోయే లోగా పీల్చుకో.

79. నువ్వు దేన్నైతే అన్వేషిస్తున్నావో, అదీ నిన్నే అన్వేషిస్తోంది

80. ప్రేమ సంపూర్ణ రూపం. మనం ముక్కలం మాత్రమే

81. ఒక్కొక్క రోజునీ నీటి ప్రవాహంలా, నిర్మలంగా అలా విడిచిపెట్టటం మంచిదే నిన్న తన కథ వినిపించేసి వెళిపోయింది. ఈ రోజు కొత్త విత్తనాలు మొలకెత్తుతున్నాయి.

82. నీకు తెలియని నీలోని అందాన్ని బయటకు తీయటానికే నేను వచ్చాను. నిన్నొక ప్రార్ధనలా ఆకాశానికి లేపుతాను

83. నేను నీకు చెప్పలేదూ? వాళ్ళు నిన్ను అనేక తప్పులు పడుతూ దూషిస్తారు వాళ్ళు నిన్ను ముతక పేర్లతో పిలుస్తారు. నీ ఆనందానికి మూలం నేనేనన్న విషయాన్ని నువ్వు మర్చిపోయేలా చేస్తారు వాళ్ళు

84. ఈ ప్రదేశం ఒక స్వప్నం. నిద్రిస్తున్నవాడు మాత్రమే దీన్ని నిజమనుకొంటాడు

85. శిథిలాలున్నచోట, రహస్య నిథి కోసం ఆశ కూడా ఉంటుంది.

86. అన్నీ దేవుని నుంచే వచ్చాయి అని తెలుసుకొన్నవారికి అన్నీ ఒకేలా కనిపిస్తాయి

87. ఇది నీ దారి, నీది మాత్రమే ఈ దారిపై ఇతరులు నీతో కలిసి నడుస్తారు కానీ ఎవరూ నీకొరకు నడవరు

88. మనం మాట్లాడుకొనే మెత్తని పదాలన్నీ స్వర్గంలో రహస్య ఖజానాలలో దాచబడ్డాయి. ఒకరోజు వర్షంలా నేలను చేరి ప్రపంచాన్ని పచ్చదనంతో నింపుతాయి.

89. నేనో పర్వతాన్ని. నువ్వు పిలు, నేను ప్రతిధ్వనిస్తాను.

90. ఎక్కడ ఉన్నా ఆ ప్రదేశానికి ఆత్మగా ఉండు

91. మంచి స్నేహితుడు కలిగిన వానికి అద్దం అక్కర లేదు

92. నువ్వేం చిత్రించాలనుకొంటున్నావో ఆ రంగులే నా భావాలన్నీ.

93. కాంతిగా బద్దలవ్వటానికి సిద్ధంగా నీలో ఒక ఉదయం ఎదురుచూస్తోంది

94. నీతో నువ్వు కన్నా నేనే నీకు దగ్గరగా ఉన్నాను

95. ఈ ప్రాతఃకాల గాలులు ఏవో రహస్యాలు నీతో చెపుతాయట, తిరిగి నిద్రమత్తులోకి జారిపోకు

96. ఒక మంచి పని చేసి
నదిలోకి విసిరేయ్
ఏదో ఒక రోజు ఎడారిలో
అది నీవద్దకు తిరిగి వస్తుంది -- రూమీ

97. నీ చేతిలో కలం నా హృదయం. సంతోషంగానో, విషాదంగానో నన్నెలా లిఖిస్తావో నీ ఇష్టం

98. ఈ ప్రపంచంలో ప్రేమను అన్వేషిస్తూ అలసిపోయాను. చివరకు ప్రేమ లోయలో లొంగిపోయి స్వేచ్ఛనొందాను

99. ఒక దివ్వె గా మారు లేక పడవ లేదూ ఒక నిచ్చెన. ఎవరో ఒకరి ఆత్మ స్వస్థపడటానికి సహాయపడు. నీ ఇంటినుండి ఒక గొర్రెలకాపరిలా బయటపడు

100. కలయిక, విడిపోవటాల గురించి చాలా చర్చే జరుగుతున్నది. కానీ, ఏనాడూ వేరుగా లేనిది తిరిగి ఎలా కలవగలదూ?

101. హృదయంతో మాత్రమే నీవు ఆకాశాన్ని తాకగలవు ....

102. చదువుకోవటం ద్వారా నేర్చుకొంటావు కానీ, ప్రేమించటం ద్వారా అర్థం చేసుకొంటావు. ....

103. ఆశించటం, లెక్కలు, బేరాలు లేకుండా ప్రేమించగలిగితే మనం నిజానికి స్వర్గం లో ఉన్నట్లే ....

104. నీ హృదయానికి త్రోవ తెలుసు. ఆ దిశలో పరిగెత్తు

105. రోజా పూవు రాలి, శకలాలై, సుగంధమై విస్తరిస్తుంది. నీవుకూడా ప్రతీ ఇంటికి కిటికీగా మారతావు. ప్రతీ మైదానంలో ఓ రోజావనం గా మొలకెత్తుతావు.

106. రాపిడులకే చికాకు పడుతుంటే, నీకు మెఋగు ఎలా పెట్టేదీ?

107. చివరకు మిగిలే సౌందర్యం, హృదయసౌందర్యం మాత్రమే

108. నీ హృదయం నుంచి నాకు ఒక దారి ఉంది

109. ప్రేమికుల ఇళ్ళలో సంగీతం ఎన్నడూ ఆగిపోదు

110. గోడలు పాటలతో, నేల నృత్యాలతో చేయబడి ఉంటాయి

111. గాయం ద్వారా కాంతి నీలోకి ప్రవేశిస్తుంది

112. నన్ను నీలో చూడలేకపోతే నన్నెప్పటికీ చూడలేవు, ఎందుకంటే ఆదినుంచీ నేను నీలోనే ఉన్నాను

113. నాకు ఈ ప్రపంచంలో స్వచ్ఛమైన నవ్వు కన్నా అమూల్యమైనది ఏదీ లేదు, మరీ ముఖ్యంగా పసిపాప నవ్వు. ....

114. ఒక క్రొవ్వొత్తి మరొక క్రొవ్వొత్తిని వెలిగించటం ద్వారా ఏమీ కోల్పోదు

115. నువు నిత్యం నిందించుకొనే జీవితం బహుసా మరొకరికి ఓ స్వప్నం కావొచ్చు

116. ఒకే భాష మాట్లాడే వారికన్నా, ఒకే భావాలు పంచుకొనే వారు ఒకరినొకరు అర్ధం చేసుకోగలరు

117. క్షమించటం అంటే ఏమిటి? సూఫీ ఇలా అన్నాడు "చిదిమి వేస్తున్నపుడు పూలు చిమ్మే సుగంధం"

118. నీకు తెలియని, నీవేనాడూ చూడని వ్యక్తులకు నీవు సహాయపడుతున్నావు ....

119. దేవుని చేరటానికి ఉన్న అనేక మార్గాలలో నేను ప్రేమను ఎంచుకొన్నాను ....

120. నేను ఎంతో మంది మనుషుల్ని చూసాను వారిపై దుస్తులు లేవు. నేను ఎన్నో దుస్తుల్ని చూసాను, వాటిలో మనుషులు లేరు. ....

121. నీవు దేవుని ప్రేమిస్తున్నావా?

సూఫీ అన్నాడు “అవును. నువ్వు సైతానును ద్వేషిస్తున్నావా? లేదు దేవునిపై నా ప్రేమ వల్ల సైతానును ద్వేషించటానికి సమయం చిక్కటం లేదు. ....

122. మాటల స్థాయిని పెంచు గొంతుక కాదు. పూలను పోషించేది వానలే కాని ఉరుములు కావు. ....

123. నిన్న నేను తెలివైన వాణ్ణి ప్రపంచాన్ని మార్చాలనుకొన్నాను. నేడు నేను జ్ఞానిని, నన్ను నేను మార్చుకొంటున్నాను

124. అర శ్వాస కన్నా చిన్నదైన జీవితంలో ప్రేమ తప్ప మరింకేదీ నాటకు

125. తలుపు తట్టు, ఆయన తెరుస్తాడు. కనపడకుండా పో, ఆయన నిన్ను ఒక సూర్యునిగా మార్చి ప్రకాశింపచేస్తాడు. క్రిందపడు, ఆయన నిన్ను స్వర్గం వరకు లేపుతాడు. ఏమీకాకుండా పో, ఆయన అన్నింటిలో నీవే ఉండేలా చేస్తాడు

126. దిగులు చెందకు నువు కోల్పోయిందేదైనా, తిరిగి మరో రూపంలో నిన్ను చేరుతుంది.

127. ప్రతిఒక్కరు ఏ పని చేయడానికి తయారుచేయబడ్డారో, ఆ పని చేయాలన్న కాంక్ష వారి హృదయాలలోనే పాదగబడింది

128. ఆత్మానుసారం నువ్వేదైనా ఓ పని చేస్తుంటే, నీలో ఆనందమనే నది ప్రవహించటం నీకు తెలుస్తుంది

129. నన్ను నీలో చూడలేకపోతే నన్నెప్పటికీ చూడలేవు ఎందుకంటే ఆదినుంచీ నేను నీలోనే ఉన్నాను

130. నీటిని తేటకోనీ. అపుడు నీలో చంద్రుడు, నక్షత్రాలు ప్రతిబింబించటం చూస్తావు.

131. ఓ నిండుహృదయాన్ని ఇంటికి తీసుకువెళ్ళాలంటే, ఓ వెయ్యి చిన్న చిన్నలౌల్యాల్ని పరిత్యజించాలి.

132. నీకింకా అర్ధం కాలేదా? నీ కాంతులే లోకాల్ని ప్రకాశింపచేస్తున్నాయి

133. గర్భగుడిని తెరిచే తలుపు నీలోనే ఉందనే విషయాన్ని మరచిపోకు

134. బాధ ఒక నిధి ఎందుకంటే అందులో ఎంతో క్షమ దాగిఉంటుంది

135. ప్రేమ నీళ్ళు లాంటిది. అందులో పడొచ్చు, మునిగిపోవచ్చు లేకపోతే మాత్రం బ్రతకలేం

136. నువు దేన్నైతే ప్రేమిస్తావో అదే నీవు

137. సమస్తాన్నీ అతికి ఉంచేది ప్రేమే అంతేకాదు ప్రేమే సమస్తమూ కూడా

138. నీవు రెక్కలతో జన్మించావు. పాకుతూ జీవించటాన్ని ఎందుకు ఎంచుకొంటావు?

139. రాత్రిపూట నక్షత్రాలను లెక్కించే ప్రేమికుని చందమామ ముద్దులిడుతుంది రహస్యంగా

140. నీ హృదయం, నా హృదయం పాత స్నేహితులు

141. నీ చుట్టూ చీకటిగా అనిపిస్తుంటే మరొక్కసారి పరిశీలనగా చూడు, నువ్వే వెలుగేమో

142. మరణం అనేది శాశ్వతత్వంతో మన వివాహం

143. పదాలను ఉచ్ఛరించని స్వరమొకటుంది. జాగ్రత్తగా విను

144. ఈ విశ్వం యొక్క ఆత్మ యొక్క ఆత్మ, ప్రేమ

145. నీ దేహం నా నుండి ఎంతో దూరంలో ఉంది. కానీ నా హృదయగవాక్షం నీ హృదయంలోకి తెరుచుకొంటుంది. దాని ద్వారా, ఒక చందమామలా నేను నీకు రహస్య సందేశాలు పంపుతాను

146. విధి వల్ల నువ్వు కోల్పోయింది ఏదైతే ఉందో, అది నీ బాధను కొంత తగ్గించిందని భావించు

147. వెలుగు నీ హృదయంలో ఉన్నప్పుడు, నీ ఇంటికి దారి తెలుసుకోగలవు

148. ఏదో శక్తి నీకు జీవితాన్నిస్తోంది, దాన్ని అన్వేషించు

149. కనులు మూసుకో. ప్రేమలో పడు. అక్కడే ఉండిపో. ఆలోచించకుండా ప్రేమకు లొంగిపో

150. ఒకప్పుడు నాకు వేల కోర్కెలు ఉండేవి, కానీ నిన్ను తెలుసుకోవాలనే ఒకే ఒక్క కోర్కెలో మిగిలినవన్నీ కరిగిపోయాయి

151. నీ జీవితానికి నిప్పు ముట్టించు. నీ మంటల్ని ఎగదోసే వానికై ఎదురుచూడు

152. ప్రేమికులు ఎక్కడో చివర్లో కలుసుకోరు. వారు ఒకరిలో ఒకరు నిరంతరం ఉంటూనే ఉంటారు

153. నీ చిక్కుముడిని విప్పే జ్ఞానాన్ని అన్వేషించు

154. నీ సర్వస్వాన్ని చెల్లించమని అడిగే మార్గాన్ని తెలుసుకో

155. వీడ్కోలులు అనేవి కళ్లతో ప్రేమించుకొనే వారికే ఉంటాయి. హృదయంతో ప్రేమించుకొనే వారికి వియోగాలే ఉండవు

156. చివరకు వచ్చేసరికి, మన జీవితపు మొదటి అధ్యాయం కాక చివరి అధ్యాయానికే విలువెక్కువ, ఎందుకంటే అదే ఈ పరుగుపందంలో మనం ఎలా పరిగెట్టామన్నది తెలుపుతుంది

157. నా హృదయం చాలా చిన్నది, కనిపించను కూడా కనిపించదు. అంత పెద్ద విషాదాల్ని అందులో ఎలా పెట్టగలుగుతున్నావు? అతను అన్నాడు "చూడు, నీ కళ్ళు ఇంకా చిన్నవి, అయినప్పటికీ అవి ఈ ప్రపంచాన్నే ఇముడ్చుకోగలుగుతున్నాయి.

158. దేన్నీ వ్యక్తిగతంగా తీసుకోకు. నీ గురించి ఇతరులు చెప్పేదంతా నీవు కాదు అది వారి ప్రతిబింబం మాత్రమే

159. మనమెవరమో మనకు తెలియవచ్చు లేదా తెలియకనూ పోవచ్చు. మనం ముస్లిమ్ లమో, యూదులమో లేక క్రిష్టియన్ లమో కావొచ్చు. మన హృదయాలు ప్రతీ హృదయానికి ఒక మూసగా మారనంత కాలమూ, మనమధ్యనున్న వ్యత్యాసాలే కనిపిస్తూంటాయి.

160. మంచి చేయటం, చెడు చేయటం అనే ఆలోచనలకు దూరంగా ఒక మైదానం ఉంటుంది. అక్కడ నిన్ను నేను కలుస్తాను

161. రాతినేలపై ఏమీ మొలవదు. నేలగా మారు. నిన్ను నీవు పెకలించుకో. అడవి పూలు నువ్వున్న చోటును వెతుక్కొంటూ వస్తాయి.

162. ఇతరులకు ఏంజరిగిందో తెలిపే కథలతో తృప్తి చెందకు. నీ గాథను నీవే విప్పుకో

163. ఈశ్వరుడు తన బిడ్డలనుంచి ఒక్కోసారి ఏమీ ఆశించడు మౌనం, క్షమ మరియు కన్నీళ్ళు తప్ప.

164. నా మాట విను. ఒక్క క్షణం దుఃఖించటం ఆపు. నీచుట్టూ పువ్వుల్ని రాలుస్తున్న దీవెనల్ని ఆలకించు

165. మన గందరగోళాన్ని స్పష్టంగా చూసుకోవటమే మేల్కొనటం అంటే

166. ఎందుకు బందీఖానాలో ఉంటావు? తలుపు బార్లా తెరిచి ఉండగా

167. నీవు ఈ లోకానికి ఓ గౌరవ అతిథివి. మట్టి పెంకులకోసం ముష్టివానిలా రోదించకు.

168. ప్రేమలో ముళ్ళు గులాబీలవుతాయి

169. నీ ప్రియవిభుని కౌగిలి లభించాలంటే, ముందు నువ్వు చేతులు చాచు

170. హృదయమనేది రహస్యంలో దాక్కున్న రహస్యం

171. కళ్ళు నులుముకొని ప్రేమను మళ్ళీ చూడు, ప్రేమతో

172. నిన్ను ఇంతవరకూ ఎవరైతే నడిపించారో, ఆయనే నీకు ఇకముందు కూడా దారిచూపుతాడు

173. మంచిరోజులు వాటంతటఅవి నీ వద్దకు రావు, నీవే వాటివద్దకు వెళ్ళాలి

174. ఈ తోటను అలంకరించింది నీ వదనమేనా? ఈ సుమాలను మత్తెక్కిస్తోంది నీ పరిమళమేనా? నీ హృదయమేనా ఈ సెలయేరును ద్రాక్షరసంగా మార్చివేసింది?

175. నేను సర్వస్వాన్ని కోల్పోయాను. నన్ను నేను తిరిగి పొందాను

176. పురుషుడిని లోపల్నుంచి స్త్రీ పరిపాలిస్తుంది.

177. నువ్వు ప్రేమ మార్గానివి.... దాని చివరనే నా ఇల్లు

178. చీకటి వైపు నడవకు. నేను చెబుతున్నాను విను "సూర్యుడు ఉన్నాడు"

179. నేర్చుకోవటంలో నైపుణ్యం ఎక్కడ ఉంటుందంటే, దేన్ని పట్టించుకోకూడదో నేర్చుకోవటంలో

180. నువ్వు దేన్నైతే గాఢంగా ప్రేమిస్తావో అదే నిన్ను కాపాడుతుంది

181. అన్ని తుఫానులూ నిన్ను నష్టపరచటానికి రావు, కొన్ని నీ మార్గాన్ని నీకు స్పష్టపరచటానికి వస్తాయి



182. ఎక్కడ ఉన్నప్పటికీ ఆ చోటుకు ఆత్మవై జీవించు

183. పక్షి స్వేచ్ఛ పొందినపుడు, పంజరం అడుగున మిగిలిపోయిన గింజలకొరకు వెనక్కి తిరిగి వెళ్ళదు.

184. కనిపించటం లేదు అని నాతో అనకు. నీ నేత్రాలను ఆయనకు సమర్పించుకో ఆయనే నీకు అన్నీ కనిపింపచేస్తాడు.

185. కరిగిపోతున్న మంచు గడ్డలా నీతోనే నిన్ను శుభ్రం చేసుకో

**నాకు నచ్చిన మరికొన్ని రూమీ గీతానువాదాలు ఇవి.**

1.

వెలిగించటానికి సిద్ధంచేసిన
ఓ దీపముంది నీ హృదయంలో.
నింపేందుకు సిద్ధంగా
శూన్యముంది నీ ఆత్మలో
నీకూ తెలుస్తూంది కదూ!

ఈశ్వరునితో నీ వియోగం
నీకు అర్ధమౌతూంది కదూ!
నిను నింపటానికి అతనిని ఆహ్వానించు.
అగ్నిని కౌగిలించుకో.

ప్రేమ తనంత తానే వస్తుందనీ
దానికై నీ తపన పాఠశాలల్లో నేర్పరనీ
గుర్తుచేసుకో.

రూమి - పాషనేట్ పోయమ్స్ ఆఫ్ రూమి" నుండి

2.

నదిని ఆలకించు
ఈ ఒడ్డుపై మరణించి
సముద్రాన్ని చేరే
నదుల మార్గాన్ని

# రూమీ వాక్యాలు

అనుసరించమని
చెపుతూంది అది

రూమీ – " సే ఐ ఆమ్ యూ " నుండి

3.
నీకు ఏదైనా కానుక నీయాలని
నేనెంత అన్వేషించానో నీకు తెలియదు.
సరైనదేదీ దొరకలేదు.
బంగారు గనికి బంగారాన్నీ,
జలనిధికి నీటినీ కాన్కలుగా ఈయటం
ఏం బాగుంటుంది.
అన్నీ అలానే అన్పించాయి.
నా హృదయాన్నో, ఆత్మనో ఇవ్వాలనుకోవటం
ఉచితం కాదు, ఎందుకంటే
అవి ఇప్పటికే నీకు సమర్పించేసాను.

అందుకే, ఒక దర్పణాన్ని తీసుకొచ్చాను.
దానిలో నిన్ను చూసుకొని
నన్ను గుర్తుచేసుకో.

రూమీ – "ది ఎస్సెన్సియల్ రూమి" నుండి.

4.
ఆశే ఈ రహస్యానికి కేంద్రబిందువు
ఆశే స్పష్టత నిస్తుంది కూడా చిత్రంగా.

నియమేమిటంటే
బాధ అనుభవించాలి.
నీ కోర్కె క్రమశిక్షనొందాలి.
భవిష్యత్తులో ఏమి జరగాలనుకొంటావో
దానిని త్యాగం చేయాలి.
రూమీ - "ది ఎస్సెన్సియల్ రూమి" నుండి.
5.
ఒంటరిగా దుఖించే ఈ జనులు నన్ను
అలసిపోయేలా చేస్తున్నారు.
మత్తెంక్కించే నీ ప్రేమ మైకంలో తేలియాడాలని
యోధుని బలాన్ని నా చేతులతో తాకాలని నా ఆశ.

ఈ అశాశ్వత రాజులతో విసిగిపోయాను.
నీ కాంతిని చూడాలనుకొంటున్నాను.

ఈ షేకులు, ముల్లాలు దీపాలు చేతబూని
వారువెతికేది ఎంతకీ దొరకక
చీకటి సందుగొందులలో
తిరుగాడుతున్నారు.

నీవు తత్వ సారానివి. ప్రేమ మైకానివి.

నీ కీర్తనలు పాడాలనుకొంటాను.
కానీ, హృదయంలో బాధించే కోర్కెతో
మౌనంగా నిలుచుండిపోతాను.

రూమి -- ద లవ్ పోయమ్స్ ఆఫ్ రూమి నుండి.

6.

ఈ నూతన ప్రేమలో మరణించు.
ఆవలి వైపున నీ దారి మొదలవుతుంది.
ఆకాశంలా మారిపో.
చేత గొడ్డలిపూని కారాగార తలుపులను ఛేధించు.
పారిపో!
కొత్తగా జన్మించినవానిలా ముందుకు సాగు.
ఆ పని ఇప్పుడే చేయి.

నీవు దట్టమైన మేఘంతో కప్పబడ్డావు.
పక్కకు జరుగు. మరణించు.
మౌనంగా ఉండు.
నీవు మరణించావనటానికి మౌనమే ఋజువు.
నీ పాత జీవితమనేది
మౌనంనుండి చేసిన ఓ పిచ్చి పరుగు.
మౌన చందమామ ఇప్పుడు ఉదయించింది. ("ది ఎస్సెన్సియల్ రూమి")

7.

ఇన్ని వేల నేనుల్లో ఏ నేనును  నేనా అని ఆశ్చర్యపోతూంటాను.
నా అరుపును విను.  నా స్వరాన్ని ముంచి వేయకు.

నీ ఆలోచనలతోనే నిండిపోయాను నేను. నా దారిలో గాజుపెంకులను వెదజల్లకు.

నీ దయ, శోకం, కోపాలను ప్రతిబింబించే నీ చేతి దర్పణాన్ని కాక మరేమీ కాను.

నీ నీడలో నా గుడారాన్ని పాతుకొంటాను.

నీ ఉనికే నా వాడిన హృదయాన్ని వికసింపచేస్తుంది.

ఈ ప్రపంచాన్ని వెలిగించే దీపానివి నీవు. నీ కాంతిని నింపుకొనే ఖాళీ పాత్రను నేను.

రూమి – "హిడెన్ మ్యూజిక్" నుండి

JULY 3, 2009

